## రాజకీయ విచారణ సంఘ బహిష్కారము

కాంగ్రెసు వారి నిశ్చయము

(గోలకొండ విలేఖరి)

ఏప్రిల్ ౯

౯వ తేది సాయంకాలము శ్రీ టి. సిద్దలింగయ్య గారి అధ్యక్షతక్రింద కాంగ్రెసు కార్యకారిణీసంఘ సమావేశము జరిగినది. అధ్యక్షులు సంఘమువారికి దివాన్ గారితో జరిగిన యింటర్వ్యూను విశదపరచిరి. వీరు దివాన్ గారితో రాజకీయ సంస్కరణ విచారణ సంఘమునందు వారిసిఫారసుల అంగీకరించెదమని వ్రాతపూర్వకముగా విశ్వాసము కలిగించవలయుననియు, బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపింపవలయునని, మహాత్ముడి విషయము అన్నిటిని అంగీకరించిరని తెలియపరచిరి.

దివాన్ గారు సకారమునందు ప్రత్యుత్తరమొసగి కాంగ్రెసుసంఘము అంగీకరించినను సంఘమునందు వారలచేర్పు వీలులేదని విశదపరచినటుల తెలిపిరి.

దివాన్ గారు అనంగీకారముగా ప్రత్యుత్తరమొసగినందున కాంగ్రెసుసభ్యు లందరు విచారణసంఘమునందు స్థానముటను నిరాకరించుచున్నటుల ప్రభుత్వమువారికి విశదపరచవలయునని తీర్మానింపబడినది.

## అనుమతిలేక సభ ఆగిపోవుట

(గోలకొండ విలేఖరి)

ఇల్లెందలపాడు, ఏప్రిల్ ౧౧

ఇచ్చటి గ్రంథాలయ వార్షికోత్సవమునకు తాలూకుదారు గారి సెలవు దొరకుననియు సభ ౨-౨నుండి ౨౮ ఖుర్దాదువరకు శోభాయమానముగా జరుగుననియు ఆశించియుండిరి. కాని గ్రేయాంసి బహులవిఘ్నానిఅనినట్లు దీనికి విఘాతము కలిగినది.

తాలూకుదారు గారి ఆజ్ఞ

నాటకము, కీర్తన, హరికథ వగైరాలు పనికిరావనియు వార్షికసభ జరుగవచ్చును గాని ఉపన్యాసకుల ఉపన్యాసములు వ్రాతపూర్వకముగా ముందుగా తహస్సీలుదారుగారికి పంపించవలయుననియు వారు ఆలోచించి వానిలో ఆక్షేపణీయములైనవానిని తొలగించి మిగతవానిని నంగీకరించవచ్చుననియు. సభాదినములలో తహస్సీలుదారు గారు ఎల్లెందలపాడులో పరిశీలన చేయవలయుననియు ఆజ్ఞ యొసగిరి. ఇది సాధ్యముకాదని గ్రంథాలయాధికారులు మరల దరఖాస్తు పంపుకొనిరని తెలిసినది. ఫలితము ముందేమగునో తెలియదు.











## ఆయుః ప్రమాణము

| | |
|---|---|
| మానవులు | ౧౦౦ సం॥ |
| రాక్షసులు | ౨౦౦ ,, |
| వృక్షములు | ౧౦౦౦౦ ,, |
| దేవతలు | ౫౦౦ ,, |
| వ్యాఘ్రములు, పక్షులు | ౩౬ ,, |
| సర్పములు, కోతులు | ౧౦౦౦ ,, |
| పెద్దపులి, పిల్లి | ౬౪ ,, |
| ఏనుగు, సింహము | ౧౦౦ ,, |
| జలగ, చక్రవాకము మండూకము | ౩౦౦ ,, |
| గుఱ్ఱములు | ౩౨ ,, |
| హంసలు | ౧౫ ,, |
| కోడి | ౮ ,, |
| నక్కలు, కుక్కలు | ౮ ,, |
| పందులు | ౧౩ ,, |
| గ్రద్దలు, గుడ్లగూబలు | ౧౨౦౦ ,, |
| రాబందులు | ౧౦౦౦ ,, |
| ఒంటెలు | ౧౦౦ ,, |
| గాడిదలు | ౨౦ ,, |
| పశువులు | ౨౦ ,, |
| చీమలు | ౧ ,, |
| భూమినుండి పుట్టుజంతువులు | ౫ మాసములు |
| అండజములు, స్వేదజములు (నల్లులు, పేలు) | ౧ ,, |

రెడ్డిరాణి

The only Leading National *Bi-weekly* of the Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA
The only out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

*Volume* 12 | Hyderabad-Dn. | Thursday 14 th April 1938 | *Number* 95

## ఆంధ్రభోజుని అస్తమయము

(గోలకొండ పత్రిక విలేఖరి)

మదరాసు, ఏప్రిల్ ౧౧

"విశ్వదాత", "కళాప్రపూర్ణ", "దేశోద్ధారక" శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు నేడు మధ్యాహ్నము ౨-౧౫ గంటలకు శ్రీ బాగునందు దివంగతులైరని చెప్పుటకు చింతించుచున్నాము.

పంతులుగారు సుమారు సంవత్సరము నుండి వ్యాధిగ్రస్తులైరి. వారు మాసముల క్రిందట మదనపల్లెయందుండిరి. కాని మార్పేమియు జరుగనందున ౩ మాసముల పూర్వము మదరాసునకు గొనిరాబడిరి. నేడుదయము ౧౧ గంటలవరకు వీరు యథాప్రకారముగా నుండుటచే యింతశీఘ్రముగ యీ ఆంధ్ర దేశమునకిట్టి యఘాతము జరుగునని అనుమానించుటకైనను వీలులేకుండెను. నేనప్పుడు వారిని దర్శించితిని. ఆసమయమున వీరు తమ బంధువులతో ముచ్చటించుచుండిరి. కాని వీరు కఠినముగా శ్వాస తీసుకొనుచున్నట్లు బాధపడుచుండిరి. గుండెలో నెప్పిగానున్నట్లు గ్రహించిరి. వెంటనే వీరు తమ కుమారుని, అర్ధాంగిని ప్రక్కకుపిలిచి మాటలాడ మొదలిడిరి. అతికష్టముపై శ్వాస తీసుకొనుచుండిరి. మధ్యాహ్నము ౨-౧౫ గంటలకు తమ స్వగృహమునందే ఆంధ్రులను దుఃఖసాగరమున ముంచివేసి కైలాసమేగిరి. దేశమునకపారనష్టమేర్పడినది. వెంటనే ఆంధ్రపత్రికా కార్యాలయమునందు పనిచేయుచుండిన పంతులుగారి జామాతలగు శ్రీ శంభు ప్రసాదుగారికి తెలుపబడెను. వారువచ్చిరి.

నగరమునందంతట యీవిదుగువార్త తెలియగనే గొప్పశీలురు సాంబమూర్తి, కాశీటంగుటూరు ప్రకాశంపంతులు, రామదాసు పంతులు, యు రామారావు, జమాల్ మహమ్మదు, యాకూబు హాసేన్, నాగంటి బాపినీడు మొదలగు ప్రముఖులనేకులు పంతులవారి అంత్యదర్శనమునకు వచ్చిరి.

దహన సంస్కారములు రేపు ఉదయము ౧౦ గంటలకు జరుపబడును.

బంధువులందరికీ ఘోరవార్త తంతిమూలమున తెలుపబడినది.

---

## కాంగ్రెసు భయపడి ఎవరికిని లొంగదు

### ముసల్మానులకు మదరాసు మంత్రి హితవు

గుంటూరు: ఏప్రిలు ౧౦

"కాంగ్రెసు సహాయ నిరాకరణపు బెదరింపుచే ఏముసల్మాను సంఘముగాని లొంగదు. కాంగ్రెసు జాతీయసంస్థ, జాతీయ మనోవైఖరి ఎట్లుండునో అది గమనించుచు, తనజాతీయాశయములు విశుద్ధమైనవని నమ్ముచు, భారతీయ ముసల్మానులయొక్క జాతీయతయందును, దేశభక్తియందును, రాజకీయ వివేకమందును గొప్ప విశ్వాసము కలిగియున్నది"అని మదరాసు ప్రభుత్వపు నిర్మాణశాఖ (తామీరాత్) మంత్రియగు యాకూబ్ హాసన్ గారు ఆంధ్ర రాష్ట్రీయ జాతీయ ముసల్మాను రాజకీయ మహాసభయొక్క ప్రథమ సమావేశముయొక్క ప్రారంభోత్సవము జరుపుచు ఉపన్యసించుచునుడివిరి.

అప్రతిహతమైన ఆత్మవిశ్వాసముతో కాంగ్రెసు జాతీయ ప్రచారమును సాగించుచునే యుండగలదనియు, తుదకు తనకు జయముకలుగగలదని దానికి నమ్మకము లేకపోలేదనియు మంత్రిగారు చెప్పిరి. "కొందరు ముసల్మానులు తమ మతస్థులతో కాంగ్రెసు హిందూసంస్థయనుచు, కాంగ్రెసుయెడ ద్వేషము జనింపచేయుచున్నారనుట జాతీయోపద్రవమనియే చెప్పగలెను. మతద్వేషములను మతసంఘర్షణలను మాఖనునందు మతభేదములుగాక రాజకీయములున్నవి. రాజకీయ నిర్బంధము చేయుట అత్మహత్యా సమానమైనపద్ధతి. అది మత సంబంధ ద్వేషములను అతిభయంకరమైనస్థితికి దెచ్చినది. దానిని ఇప్పుడె త్రుంచివేయకున్నచో, దానివల్ల చాల ఉగ్రతరమైన ఫలితములు జరుగగలవనినుడివిరి"

---

## పంతులవారి జీవిత సంగ్రహము

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు క్రి. శ. ౧౮౬౭ సం॥ లో యెలకుర్రు కృష్ణాజిల్లా గ్రామమునందు జన్మించిరి. వీరు బందరులోని హిందూహైస్కూలు, మదరాసులోని క్రిశ్చియన్ కళాశాలయందు విద్యాభ్యాసమొనర్చిరి. బాల్యమునుండియే పంతులుగారికి వ్యాపారమనిన చాలాయుత్సాహముగా నుండెను. సుమారు ౨౦ సం॥ లవరకు వీరు బొంబాయియందు పత్రికా నిర్వహణము, వ్యాపారమునందు మగ్నులై యుండిరి. ౧౮౯౩ లో వీరు అమృతాంజనండిపో యేర్పరచిరి. ౧౯౦౮ ఆంధ్రపత్రిక (వార) స్థాపించిరి. ౧౯౧౪ లో దానిని దినపత్రికగా మార్చి వీరు మదరాసుకే తెంచిరి. వీరు తమ స్వగ్రామమునందు స్వంత వ్యయముతో నొక సెకండరీపాఠశాల నెలిపిరి పాఠశాలయందు సవర్ణ, హరిజన భేదములు లేవు. హరిజనుల దేవాలయప్రవేశమునకు వీరు మార్గదర్శకులు. హరిజనుల అభ్యుదయమునకు వీరమితముగా ధనసహాయమొనరించిరి. ఆంధ్రదేశమందలి రాజకీయ, మత, సాంఘిక, ఆర్థికయుద్యమములకు కామధేనువు. వీరిసాయము బడయని యుద్యమము, సంస్థ, యావదాంధ్రావనియందు గలదాయను సందేహము గలదు. ఆంధ్రభాషకు వీరు సలిపినసేవ అమూల్యము. వీరు నిజముగా ఆంధ్రభోజులు. భారతదేశమునందు ఆంధ్రులకు, ఆంధ్ర వ్యక్తిత్వ దేశమునకు స్థానము కలిగించినవారు వీరు. నేడు దేశమునందు వంగీయులతర్వాత స్థానమాక్రమించగలవారు ఆంధ్రులనుట నిశ్చయము.

ఆంధ్రమహాసభ వీరికి దేశోద్ధారక, విశ్వదాత యను గౌరవముతో పూజించి ధన్యతగాంచినది. కళాప్రపూర్ణ బిరుదుతో ఆంధ్రవిశ్వవిద్యాపీఠము వీరిని గౌరవించినది.

భాషాభివృద్ధికి వీరు ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్ర గ్రంథమాల, విజ్ఞాన సర్వస్వము మొదలగు సాధనములతో సలిపినసేవ చరిత్రయందు సువర్ణాక్షరములలో లిఖింపబడియున్నది.

అఖిలభారత కాంగ్రెసు సంఘమునందు వీరు ఆంధ్రులకు ప్రాతినిధ్యము సంపాదించిరి. వీరు మదరాసుయందలి బ్యాంకుఆఫ్‌హిందూస్థాన్ కు డైరక్టరులు.

౧౯౩౦ లో ౬ మాసములు లవణ సత్యాగ్రహసందర్భమున, ౧౯౩౨ లో శాసనోల్లంఘన సందర్భమున ౬ మాసములు కృష్ణజన్మస్థానము దర్శించిరి.

కృష్ణా తూర్పుగోదావరి జిల్లాల నుండి వీరు సాటిలేని విధముగ శాసనసభకెన్నుకొనబడిరి కాని ఆరోగ్యముచెడినందున వీరు విరమించుకొనిరి.

---

గోలకొండపత్రిక

(జాతీయ అర్ధవారపత్రిక)

హైదరాబాదు

చందా వివరములు

సంవత్సరమునకు రు ౬-లు

అర్ధసంవత్సరమునకు రు ౩-లు

విడిపత్రిక ౧ అణా

---

## కాంగ్రెసు కార్యకారిణీ సంఘ సమావేశము

### మధ్యరాష్ట్ర న్యాయశాఖ మంత్రి చర్యపై చర్చ

కలకత్తా: ఏప్రిలు

కాంగ్రెసు కార్యకారిణీ సంఘమువారు ౧౧ తేది ఉదయము ౧౧గం. ల నుండి మధ్యాహ్నము ౧-౨౦గం.ల వరకును తర్వాత ఫలహారము పుచ్చుకొని రాత్రి ౭-౪౫ గం. ల వరకును సమావేశమై ముఖ్యముగా మధ్యరాష్ట్రమందు న్యాయశాఖామంత్రియగు షరీఫు గారు రాజకీయ ఖైదీగాని జాఫర్ గారిని విడుదల చేయుట కిచ్చిన ఉత్తరము సక్రమమా అక్రమమా అను విషయమునుగూర్చి చర్చించిరి, మొత్తము ౭ గంటల కాలము చర్చజరిగెను. తుదకు షరీఫు గారు జాఫరును విడుదలచేయించుటలో తమ అధికారమును సరిగా వినియోగించినది లేనిది నిర్ణయించుటకై నిష్పక్షపాతముగ విచారణ చేయించుటకు నిశ్చయించినట్లు తెలియుచున్నది. ఇదంతయు ఒక హైకోర్టు జడ్జికి అప్పగించబడును. షరీఫు గారు అధికారమును సరిగా వినియోగించిరని నిర్ణయించబడినచో మంచిదే, షరీఫు గారిది తప్పని నిర్ణయించబడినచో షరీఫుగారిని రాజీనామానీయుమని కోరెదరు.

### బెంగాలు బీహారీల వివాదము

కలకత్తా: ఏప్రిలు

౬ తేది ఉదయము కార్యకారిణీ సంఘమువారు బీహారులో స్థిరనివాస మేర్పరచుకొనియుండు బెంగాలీయుల పక్షమున సమర్పించుకొనబడిన మెమొరాండముగూర్చి అలోచించి అవిషయమును పరిష్కరించుట బాబు రాజేంద్రప్రసాదు గారికి అధికారమిచ్చిరి.

---

## మధ్యరాష్ట్రమందు విద్యామందిర ప్రణాళిక అమలు

### ౧౬౬ ఉపాధ్యాయుల పదవులకై ౫౦౦౦ దరఖాస్తులు

నాగపూరు ఏప్రిలు ౧౨

మధ్యరాష్ట్రమందు విద్యాశాఖ మంత్రియగు రవిశంకర శుక్లగారు తయారుచేసిన విద్యామందిర ప్రణాళిక శాసనసభచే ఆమోదించబడినది. ఆప్రణాళిక అమలు అతివేగముగ జరుపబడును.

ప్రతి తహసీలులో రెండు విద్యామందిరములచొప్పున మొత్తము ౧౬౬ విద్యా మందిరములు ప్రస్తుతము స్థాపించబడి, ఒక్కొక్క విద్యామందిరమున కొక్కొక్క ఉపాధ్యాయుని చొప్పున మొత్తము ౧౬౬ మంది ఉపాధ్యాయులపదవులకు దరఖాస్తులు కోరబడగా నిన్నటివరకు ౫౦౦౦ దరఖాస్తులు చేరినవి. ఈదరఖాస్తుదారులలో ౧౦ లా గ్రాడ్యుయేట్లును, ఒక యం.ఏ. (ఆక్స్‌ఫర్డు)యు, ౨౪౦ మంది మెట్రిక్యులేట్లును గలరు. ఈదరఖాస్తులను "సెలెక్టు కమిటీ"వారు పరిశీలించి ప్రస్తుతము గ్రహించదగినవారిలను నిర్ణయించవలసియుండును. ... సెలెక్టు అయినవారిలో ౧౬౬ మందిని తీసికొందురు. ఇట్లు గ్రహించబడినవారు ౧౬ ఏప్రిలునాడు వార్ధాలో శిక్షణము (ట్రెయినింగు), పొందవచ్చుటకై పోవుదురు. ఈ ట్రెయినింగు పాఠశాలలు ౨౨ ఏప్రిలునాడు ప్రారంభమగును.

ట్రెయినింగుస్కూలు ప్రారంభోత్సవమును గాంధిమహాత్ముడు వార్ధాలో జరుపవచ్చునని యు, విద్యాశాఖమంత్రి శుక్లగారు అసమయమున హాజరగుదురనియు తెలియుచున్నది. విద్యామందిరములకై భూదానము చేయుటకు వాగ్దానమిచ్చినవారలలో సీతాబాయి చునిలాల్ (అకోలా, బరారు)గారొకరై యున్నారు వారు పాఠశాల స్థాపనకై బాలాపూరు తాలూకాలో ౧౦౫ ఎకరముల భూమినిచ్చిరి.

---

## గవర్నరుగారు అన్యుల పరిశీలనార్ధము ప్రభుత్వపు కాగిదము లివ్వనందున

# సి. పి. మంత్రివర్గములో విప్లవము

## మంత్రులకు రాజీనామాలే గత్యంతరము

## సర్దారు వల్లభాయి పటేలుగారి ఆధిపత్య నిరాకరణము

నాగపూరు ఏప్రిల్ ౧౨

మధ్యరాష్ట్ర ప్రభుత్వపు న్యాయశాఖా మాత్యులగు షరీఫుగారు రాజకీయేతర నిర్బంధితుని విడుదలచేసిన విషయము ప్రభుత్వమునందేగాక కాంగ్రెసు కార్యకారిణీసంఘమునందు సహితము చర్చింపబడినది.

గా॥ షరీఫుగారి పరిష్కారము, తత్సంబంధపు కాగితములు పరిశీలించుటకు సర్ మన్మథ్‌నాథ్ ముకర్జీ గారు జ్యూరిస్టుగా కార్యకారిణీ సభచే నియమింపబడిరి. కాని యీవిషయమున కాంగ్రెసు వర్గమునందు తీవ్రమగు అలజడి యేర్పడినది.

దీనివలన యేర్పడిన పరిస్థితుల విచారించుటకు మంత్రివర్గమందలి వివిధ శాఖామాత్యులు ఆలోచించుచున్నారు. గంటల వ్యవధిలో గాకున్నను వారము పదిరోజులలో నొకరిద్దరు మంత్రులు రాజీనామా నివ్వనున్నట్లు రూఢిగా తెలియుచున్నది.

మధ్యరాష్ట్రపు బరారు గవర్నరుగారు యీవిషయమున నెలయు ప్రభుత్వకాగిదములు కాంగ్రెసు అధిపతులు నిర్ణయించిన విచారణ సంఘమునకు అధికార రహస్యశాసనము (ఆఫీషల్ సీక్రెట్సు ఆక్టు)నను సరించి యివ్వవీలులేదని స్పష్టముగా విశదపరచినట్లు తెలియుచున్నది.

"హిందుస్థాన్"యను కాంగ్రెసు వాది పత్రిక యందు యీవిషయమై ప్రకటితమైన ౩ కాలముల వ్యాసమునందిట్లు వివరింపబడినది.

"నేడు దేశమునందు కార్యకారిణీ సంఘమువారు సామ్రాజ్యప్రతికూల వాతావరణ మేర్పరచుటకు మారు సర్దారుగారికి దాసోహమనని వారల రాజకీయ వాక్స్వతంత్ర్యము హరించుటకు నిశ్చయింపబడిన యొక్కభ్రష్ట పరిణామముపొందుచున్న సంస్థను నిర్మించుట అర్జాకరము" అని సర్దారు వల్లభాయిచర్యలు ఖండింపబడినవి.

"కాంగ్రెసు కార్యకారిణీ సంఘమువారి తీర్పు అవమానకరము, అన్యాయమని ప్రపంచమునకు విశదపరచుటకు మధ్యరాష్ట్ర మంత్రివర్గమువారికి రాజీనామా నొసగుటతప్ప వేరు మార్గమేదియు లేదని" స్పష్టపరచబడినది.

"ప్రస్తుతపరిస్థితులు తప్ప యితరులవలన ప్రభుత్వము సాగజాలని పరిస్థితులు కలిగించుట శాసనసభ్యుల ముఖ్య కర్తవ్యము, సర్దారుని హేయకార్యమునకిదియే ప్రతిఫలము. దీనికి వ్యతిరేకముగా ప్రవర్తించిన కాంగ్రెసు, కార్యకారిణీ సంఘమువారు దేశమునందపఖ్యాతిపాలగుట నిశ్చయము" అని ప్రబోధింపబడినది.

---



Printed ... Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy.